Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యుం I.] మద్రాసు : 1941 వ సం॥ ఏప్రిల్ నెల 5 వ తేది శనివారం [నె 3 రు

## ఈ వారంలో యుద్ధ వార్తలు.

### జర్మనీపై బ్రిటిషు విమాన దాడి.

బ్రిటిషు రాయలు విమానదళం ఈవారం జర్మనీలో, ఆయుధ కర్మాగారాలు, మందుగుండు ఫ్యాక్టరీలువున్న ప్రదేశాలను వెదకి వెదకి వాని మీద అగ్ని వర్షంకురిపించి వచ్చినాయి. జర్మనీలో రర్, రైను ప్రాంతం అనే ప్రదేశాలలో ఇట్టి కర్మాగారాలు విశేషంగావున్నాయి. 27 వ తేదిన ఈ ప్రాంతాలలోగల డస్సెల్డార్ఫు, కలోను అను పట్నాలమీద వేసిన బాంబులవలన చాల ఫ్యాక్టరీల భవనాలు గిడ్డంగులు పూర్తిగా భస్మమై పోయినాయి. ఈ విధంగా చాలనష్టం గల్గిన విషయం జర్మను అధికారులే తమ ప్రకటనలో అంగీకరించారు.

జర్మనీపైదాడుల సల్పుటయేకాక, బ్రిటిషు విమానాలు, ఉత్తరమున నార్వేనుండి దక్షిణమున ఫ్రాన్సు పశ్చిమతీరం వరకు, జర్మనుల ఆక్రమణలోనున్న రేవులన్నిటిపైన వేలకొలది బాంబులు వర్షించి ధ్వంసం చేస్తున్నాయి. ఈ రేవులలోనే జర్మనులు, బ్రిటనుపై దాడికి సన్నాహాలు చేస్తున్నారు. శత్రు నౌకలు ఈ రేవులనుండే బయలుదేరుతున్నాయి. ఆ ప్రాంతాలలోగల విమానాశ్రయాల నుండే శత్రు విమానాలు బ్రిటనుపై దాడికి బయలుదేరుతున్నాయి. అందుచే, బ్రిటిషు విమానాలు, ఈ ప్రాంతాలపైన మరీ భయంకరమైన దాడులు సాగించాయి.

27 వ తేదిన డంకర్కు, కెలే రేవులపైన బ్రిటిషు విమానాలు చిన్నదాడిని మాత్రమే జరిపాయి. కాని పరాను తీరమునకు సమీపంగా సముద్రంలో సరకులను తీసుకొని వెళ్లుచున్న శత్రు నౌకల మీద మాత్రం చాలబాంబులు వర్షించాయి. ఆల్డర్నీ అనే రేవులోవున్న, శత్రువుల సప్లై నౌక ఒకటి బాంబు దెబ్బతో మునిగి పోయింది. శత్రువులు యుద్ధనౌకానిలయంగా ఉపయోగించుకుంటున్న "బ్రెస్టు" అనురేవునుగూడ బ్రిటిషు విమానా లెదిర్చినవి. శనివారం నాడు, బ్రిటిషు విమానాలు పగలు బహిరంగంగానే ఫ్రాన్సు సముద్ర తీరప్రాంతములలోగల శత్రు విమాన నిలయాలపైకి జని, చాలక్రిందుగా విహరిస్తూ మరఫిరంగులతోనే గుండ్ల వర్షం కురిపించాయి. ఒక్క శత్రు విమానమైనా పైకివచ్చి ప్రతిఘటించలేదు.

పరాను రేవులపైన బ్రిటిషు విమానాలు ఆదివారం రాత్రి మరీ తీవ్రమైన దాడులను సాగించాయి. లోరియంటు అనే రేవువద్ద జలాంతర్గాముల ధ్వంసంచేసే శత్రు నౌక ఒకటి, ఒక్కబాంబు దెబ్బతో మునిగిపోయింది. కెలే మొదలగు ఫ్రాన్సురేవు పట్నాలలో, బ్రిటిషు విమానాలు వేసిన బాంబులప్రేలుడుధ్వని, బ్రిటిషు తీరానికి వినిపించింది. అచట లేచినమంటలు, 28 మైళ్ల దూరానవున్న బ్రిటిషు తీరపు ప్రజలకు కన్పించాయి. ఫ్రాన్సు తీరపు రేవులమీద బ్రిటిషు విమానాలు సోమవారం పగలు అంతకంటె భయంకరమగు దాడి జరిపాయి. అట్లాంటికులో బ్రిటిషు నౌకలపై దాడులకు జర్మనులు పంపిన నీసెనూ, షారన్‌హార్స్టు అను నౌకలు, బోర్డూ అనే పరాను రేవులోవున్నట్లు తెలిసి బ్రిటిషు విమానాలా రేవుపైవేలకొలది బాంబులు వర్షించాయి. బాంబులు సూటిగా ఆనౌకలపైపడినట్లు చూడలేదుగాని, రేవునందలి "డాకు" లన్నీగూడ తుత్తునియలై అగ్నిజ్వాలలకు ఆహుతి అయినట్లు కనపడ్డాయి. లెహోవ్రె అనే రేవులో నిలచివున్న సూనెరవాణాలకుపయోగించబడే రెండు శత్రు నౌకలు ముంచివేయబడ్డాయి. కెలే మొదలు డంకర్కు వరకుగల పరాను తీరమంతా, బ్రిటిషు బాంబులచే లేచిన అగ్నిజ్వాలలు బ్రిటిషుతీర ప్రజలకు బాగాకనపించాయి. డచ్చి తీరమునకు సమీపంలో ఒక జర్మను సప్లై నౌకను మరియొక విమానధ్వంసక నౌకను బ్రిటిషు విమానలు మర ఫిరంగుల గుండ్లతో తూట్లుగా కొట్టినవి.

### బ్రిటనుపై విమాన దాడి.

బ్రిటిషు విమానాలు జర్మనీపై అట్లా విజృంభిస్తూవుంటే, ఇంగ్లాండుమీద మాత్రం జర్మనుల విమానదాడులు చాలా తగ్గిపోయినాయి. మార్చి 22 వ తేదినుండి లండనుమీద పగలు కాని రాత్రిగాని విమానదాడులులేవు. గడచిన ఆరు నెలలలో లండను ప్రజలు వరుసగా యిన్ని రోజులు ఇంత విశ్రాంతిగా ఎపుడు వుండలేదు.

శుక్రవారంనాడు మాత్రం కొన్ని శత్రు విమానాలు ఆంగ్లదేశపు దక్షిణ తీరం మీదకు వచ్చాయి. వానిలో ఒకదానిని బ్రిటిషు విమానాలు సముద్రంలో పడేటట్లు కొట్టినవి. శనివారంనాడు పగలు మూడు శత్రు విమానాలు మాత్రమే బ్రిటిషు తీరపు పట్నాలమీదికి వచ్చాయి. వానిలో ఒకదానిని బ్రిటిషు విమానాలు పడగొట్టినాయి. శనివారం రాత్రిమాత్రం ఇంగ్లాండు పశ్చిమ తీరంలో ఒకపట్నంమీద శత్రు విమానాలు దాడివచ్చినాయి. ఈ దాడి కొంచెం సేపే జరిగినను చాల తీవ్రంగా జరిగింది. కొంతనష్టం కలిగింది. ఆదివారంనాడు కొన్ని విమానాలు ఒక్కటొకటిగా వచ్చి ఆంగ్లదేశంలో అక్కడక్కడ కొన్ని బాంబులు వేశాయికాని నష్టం ఎక్కువ కలుగలేదు.

బ్రిటనపై జరిగిన విమానాదాడులలో జనవరినుండి ఇంతవరకు 50 శత్రు విమానాలను బ్రిటిషు విమానాలు పడగొట్టాయి. ఈ మూడు నెలలలోను అన్ని ప్రాంతాలలోను 155 విమానాలను పడగొట్టినవి. బ్రిటిషు విమానాలు 41 నష్టమైనాయి. ఇంతవరకు ఇంగ్లాండుదేశంమీద జరిగిన జర్మను విమాన దాడులవలన ప్రజలలో 28,859 మంది మరణించారు, 40,756 మందికి గాయాలు తగిలాయి అని బ్రిటిషు ప్రభుత్వంవారు ప్రకటించారు.

మార్చి 29 వ తేదితో ముగిసేవారంలో ఆంగ్ల దేశంలో 8 జర్మను విమానాలు పడగొట్టబడ్డాయి. ఒక బ్రిటిషు విమానం ఇంగ్లాండుమీద 10 జర్మనీమీద పడి పోయినాయి.

### జపాను విదేశాంగ మంత్రి పర్యటనం.

జపాను విదేశాంగమంత్రియగు మట్సువోకాగారు గత 28, 29 వ తేదీలలో బర్లినులో హిట్లరుతోను ఇతర నాజీ

నాయకులతోను సంప్రదింపులు సాగించారు. ఈ రోజులలోనే యుగోస్లావియా దేశంలో ప్రజల సహాయంతో పీటరు రాజు, రాజ్యాధికారాన్ని వహించి—జర్మనీతో ఒడంబడిక చేసుకున్న మంత్రివర్గాన్ని రద్దుచేసి, ఆ యొడంబడికను ప్రతికూలమగు వారిని క్రొత్త మంత్రులుగా నియమించి, సైన్యాన్ని ప్రోగుచేసుకోడానికి ప్రారంభించాడు. జర్మను పలుకుబడి యెట్లా శిథిలమై పోతున్నదో ఈ సంఘటనవలన మట్సు ఒకాగారికి తెలిసియే యుండాలి. మట్సు ఒకాగారు 30 వ తేదిన ఇటలీకి వెళ్లి 2 వ తేదివరకచట నుండి ముసులోనీతోను ఇతర ఫాసిస్టు నాయకులతోను రోమను కాతలిక్కు మతాధ్యక్షుడగు పోపుతోను సంభాషించాడు. మధ్యధరా సముద్రంలో జరిగిన నౌకా యుద్ధంలో ఇటాలియను నౌకాదళం నాశనమైపోయినదనే వార్తల వివరాలుగూడ, మట్సు ఒకాగారికి అపుడు పూర్తిగా తెలిసి వుండాలి.

## అల్బేనియా రంగం.

వెనుకటివారం తాము ప్రారంభించిన దాడులలో అపారమైన నష్టం కల్గటంవలన, అల్బేనియా రంగంలో, ఇటాలియను సైన్యాల ఉత్సాహం తగ్గిపోయింది. ఇపుడు గ్రీకు సైనికులున్న స్థానాలమీద దాడులు చేయడం చాల తగ్గించివేశారు. క్రిందటి వారం రణరంగంలో చచ్చిపోయిన వారిని ప్రాతి పెట్టుటకుగాను, యుద్ధాన్ని కొంతసేపు విరమించవలసినదనిగూడా, ఇటాలియనులు గ్రీకులను ప్రార్థించారు. గ్రీకు లందుకు అంగీకరించారు. తరువాత మరల యుద్ధం సాగించారు. దీనినిబట్టి, ఇటాలియను లెంత హెచ్చుగా చచ్చిపోయారో తెలుస్తుంది.

29 వ తేదిన ఇటాలియను సైన్యాలు ఫిరంగులతో, ఆవూస్ నదీ ప్రాంతాన గ్రీకు సైనిక శిబిరాలపై చిన్న దాడి తీశాయి. కాని అధికమైన నష్టం కల్గించి గ్రీకులా దాడిని తిరుగగొట్టారు. రెండు శత్రు విమానాలుగూడా పడగొట్టబడినాయి. శుక్రవారంనాడు గ్రీకు సైన్యాలు ఒకచోట శత్రువులకు వెనుకవైపుగా వచ్చి చాల ప్రాంతాన్ని ఆక్రమించుకున్నాయి. ఆ మరునాడు జరిగిన యుద్ధంలో గ్రీకులు చాలమంది శత్రు సైనికులను ఖైదీలుగా పట్టుకున్నారు. ఇటాలయనులు, గ్రీకు స్థానాలపైన మరల దాడి సాగించే అభిప్రాయం వదలుకొని శత్రు దాడులను నిరోధించి ఆత్మరక్షణ మొనర్చుకొనుటకుగాను కందకములు మొదలగువానిని త్రవ్వుకొనుచున్నారు.

గ్రీకు, బ్రిటిషు విమానాలు ఆదివారంనాడు శత్రువుల కిక మిగిలియున్న డురాజో రేవుపైన, అబిస్సీనియాలోని యితర కోటలమీద బాంబులు వేసి వాటిని శిథిలంచేసి వచ్చినవి.

మార్చి 29 వ తేదీతో ముగిసే వారంలో మధ్యప్రాచ్య ప్రాంతపు యుద్ధరంగాలలో 26 ఇటాలియను విమానాలు పడగొట్టబడెను. బ్రిటిషు విమానాలు మూడు మాత్రమే నష్టమైనాయి.

## యుగోస్లావియా.

యుగోస్లావియాలో గత 27 వ తేది ఉదయం ఒక్క రక్తపుబొట్టయినా చిందకుండ జరిగిన ఆ మహా విప్లవం— జర్మనులకు దిగ్భ్రమకలిగించింది. అట్టిది సంభవిస్తుందనీ, తమ యెత్తులన్నీ అటుల తారుమారౌతాయనీ జర్మనులు కలలోనైనా తలచియుండలేదు. యుగోస్లావియా తనవైపు చేరిందనీ, గ్రీసుపై నిరాఘాటంగా దాడితీయవచ్చుననీ, అనుకుంటున్న హిట్లరు ఆశాసౌధాలన్నీ ఒక్కమాటుగా నేలకూలిపోయాయి.

యుద్ధంలేకుండా యెట్లాగైనా యుగోస్లావియా క్రొత్త ప్రభుత్వాన్ని తనవైపు త్రిప్పుకోవాలని హిట్లరు శతవిధాల ప్రయత్నిస్తున్నాడు. సామదాన భేదదండోపాయాలన్నీ ఉపయోగిస్తున్నాడు. కాని అవి ఏమీ ఫలించుటలేదు.

మైనరగు పీటరు రాజు వెనుకటి మంత్రివర్గాన్నీ, పరిపాలకవర్గాన్నీ రద్దుచేసి పరిపాలనాధికారాన్ని తానే వహించాడనటంతోనే, యుగోస్లావియా తమకు ప్రతికూలమగుతున్నదని, నిజంగా ఆ విప్లవం తమమీదనేనని జర్మనులు గుర్తించారు. ఆనాడు పీటరు రాజు రాజ్యాధికార స్వీకారోత్సవం జరిగినపుడు రాజధానియగు బెల్గ్రేడునందు దేశమందలి ఇతర ప్రాంతాలలోను ప్రజలు అపరిమితోత్సాహంతో జరిపిన ఉత్సవాలు, ఇటలీ-జర్మనీలయెడల జరిపిన ప్రతికూలార్భాటాలు, జర్మనుల అనుమానాలను మరింత అధికంచేశాయి.

క్రొత్త ప్రధాని జనరలు సిమొవిచ్‌గారు ఇటలీ జర్మనీల అనుమానాలను కొంతవరకు తగ్గించడానికిగాను, వెనుకటి మంత్రులవలంబించిన విదేశాంగ విధానాన్నే తాము సాగింపదలచితిమని, పొరుగుదేశాలన్నిటితోను స్నేహంగావుండటమే తమ ఉద్దేశమని ప్రకటించారు. "ఇతరదేశాలకు ఏవిధమగు సాకును దొరకకుండ వుండుటకు" గాను "కొన్ని దేశాలకుం ప్రతికూలంగా ప్రజలు సాగిస్తున్న ప్రతికూలార్భాటాలను" విరమింపవలసినదని ప్రజలనుగూడా మందలించారు. క్రొత్త క్రొత్త మంత్రివర్గపు ఉద్దేశాలను స్పష్టపరచుకొనుటకోసం, జర్మనీ యుగోస్లావియాలకు జరిగిన ఒడంబడికను మన్నించునదీ లేనిదీ తెలుపవలసినదని జర్మనులు అడిగారు. అంతేకాక, ఆ ఒడంబడిక షరతులను బహిరంగముగా ప్రకటించవలసినదనీ, యుగోస్లావియా సైన్యాలను రద్దుచేయవలసినదనీ కూడా జర్మనులు యుగోస్లావియాను కోరారు. ప్రధాని సిమొవిచ్‌గారు దానికి సమాధానం 1 వ తేదీన అందజేశారు. అతడీషరతులను అంగీకరించి యుండడని వేరే చెప్పనక్కరలేదు.

ఈలోగా జర్మనులు యుగోస్లావియాను బెదరించడానికి ఎన్ని ప్రయత్నాలు చెయ్యాలో అన్నీ చేసిరి. యుగోస్లావియాలోనున్న జర్మనులపైన ఘోరమగు క్రూరచర్యలు జరుగుతున్నాయనీ, జర్మనీని అవమానిస్తూ ప్రజలు ఆర్భాటాలు చేస్తున్నారనీ, అధికారులు వానిని సహించి వూరుకుంటున్నారనీ, జర్మను పత్రికలలో, అనేకరకాల ఆరోపణలతో తీవ్రమైన ప్రతికూల ప్రచారాన్ని వారు సాగించారు. దీనికితోడు యుగోస్లావియానుండీ, జర్మనులు, ఇటాలియనులు లేచిపోవడం ప్రారంభించారు. జర్మను రాయబారిగూడా వెళ్లిపోతాడను వదంతులను వ్యాపింపజేశారు. ఇదంతా, యుగోస్లావియా లొంగకపోతే, జర్మను సైన్యాలు దాడిసాగిస్తాయని ప్రజలను భయపెట్టడానికి ఉద్దేశించిన ప్రచారం. గాని నిజంగా జర్మనులపై దౌర్జన్యాలు జరిగినవను ఆరోపణలన్నీ అసత్యమని యుగోస్లావియా ప్రభుత్వం వెంటనే ఖండించింది.

యుగోస్లావియాలో (1) క్రోటులు, (2) సర్బులు, (3) స్లావెనులు అని మూడు ఉపజాతుల ప్రజలున్నారు. వీరిలోవీరికి విభేదాలు కల్పించి చీలదీయడానికి, అనేక మాయోపాయాలనుగూడ జర్మనులు సాగించారు. సర్బులపైన మిగిలిన రెండుజాతులకు ద్వేషం కల్గించడానికి ప్రయత్నించారు.

కాని ఆ భేదోపాయలకు క్రోటు నాయకులు లొంగలేదు. తమ ప్రాంతమునకు రాష్ట్రీయ స్వపరిపాలనమిస్తూ 1939 లో జరిగిన ఒడంబడికను సర్బులు అంగీకరించి మరల దృఢపరిస్తే తాము యుగోస్లావియాలోనే వుంటామని క్రోటు నాయకులు ప్రకటించారు. సివెలవిచ్‌గారి ప్రభుత్వం ఆ విధంగా హామీచేసింది. అందుచే యుగోస్లావియా ప్రజలలో చీలికలు కల్పించడానికి జర్మను లొనర్చిన ప్రయత్నాలుకూడా విఫలమైపోయినాయి.

జర్మను లోకవైపున ఇట్టి బెదరింపులు చేస్తుంటే, ప్రధాని సిమొవిచ్‌గారు, దేశములో సైన్యాలనన్నిటినీ త్వరితంగా సమీకరించడం ప్రారంభించాడు. శత్రుదాడివస్తే ప్రతి పౌరుడును, నిలచి తన గృహాన్ని కుటుంబాన్నీ రక్షించుకోవడానికి సంసిద్ధంగా వుండవలసినదని హెచ్చరించాడు. సరిహద్దులను కాపాడడానికి సైన్యాలను పంపించాడు.

జర్మను తంత్రాలన్నీ ఈ విధంగా భగ్నమగుటవలన, ఇక యుద్ధం ప్రకటించి దాడి సాగించడం తప్ప యుగోస్లోవియాను లొంగదీయడానికి జర్మనుల కింకొకమార్గం లేదు. అట్టి దాడిని నిరోధించడానికి యుగోస్లోవియా సిద్ధంగానే వుంది.

## విషీ.

గత ఆదివారంనాడు ఉత్తర ఆఫ్రికాతీరంవద్ద సంభవించిన ఒక సంఘటనవలన ఆంగ్లదేశానికి ఫ్రాన్సుకు యుద్ధం సంభవించేదే. కాని బ్రిటిషు యుద్ధ నౌకలు కనుబరచిన ఓరిమివలన తప్పింది. ఇండో-చైనానుండి, మడగాస్కరునుండి నాల్గు ఫ్రాన్సు వర్తక నౌకలు, జర్మనీకి చాల ముఖ్యమగు యుద్ధ సామగ్రిని తెచ్చుచున్నవనీ, వానివెంట ఒక డిస్ట్రాయరుకూడ కాపలా వచ్చుచున్నదనీ, ఆ నౌకలు జిబ్రాల్టరు జలసంధి గుండాపోవునని, బ్రిటిషు నౌకాధికారులకు తెలిసినది. ఆ నౌకలను పట్టుకొని పరీక్ష చేయవలసినదని బ్రిటిషు అధికారులు, జిబ్రాల్టరువద్దనున్న తమ నౌకాదళానికి ఉత్తరువు చేశారు.

ఆ యుత్తరువుల ప్రకారం బ్రిటిషు యుద్ధనౌకలు బయలు దేరినాయి. కాని జిబ్రాల్టరు జలసంధివద్ద ఆ పరాసు నౌకలు ఆఫ్రికా తీరానికి సమీపంగా వెళ్లాయి. ఆ తీరం స్పెయినువారిది. తీరానికి మూడు మైళ్లవరకు సముద్రం స్పెయిను అధికారం క్రిందనేవుంది. ఆ సరిహద్దులోపలనే పరాసు నౌకలు ప్రయాణము చేయడంచేత బ్రిటిషు యుద్ధ నౌకలు అక్కడ ప్రవేశించి పట్టుకోడానికి వీలులేకపోయింది.

స్పెయిను సరిహద్దులదాటి ఉత్తర ఆఫ్రికాలోని ఫ్రాన్సువారి అల్జీరియా తీరమునకు సమీపంగా ఫ్రాన్సు నౌకలు వెళ్లుచుండగా, బ్రిటిషు యుద్ధ నౌకలు ఆ నౌకలవద్దకు వెళ్లి, వానిని పరీక్షించడానికి ఆగవలసినదని ఉత్తరువు చేశాయి. కాని ఫ్రాన్సు నౌకలు ఆగలేదు. సరిగదా ఒడ్డున వున్న ఫిరంగులనుండి పరాసువారు బ్రిటిషు నౌకలపై ఫిరంగి గుండ్లను కురిపించడానికి ప్రారంభించారు. ఆంగ్ల యుద నౌకలు ఆత్మరక్షణ కొరకు మరల ఫిరంగుల ప్రేల్చి ఒడ్డుననున్న పరాసు ఫిరంగులను శిథిలంచేశాయి. ఇట్టి స్థితిలో ఫ్రాన్సు వర్తక నౌకలమీదగూడ ఫిరంగుల నుపయోగించి వానిని ముంచివేసినాకూడ బ్రిటిషు అధికారుల చర్య ధర్మసమ్మతంగానే వుండేది. కాని దయదలచి వారట్లు చేయలేదు.

## అమెరికా—అక్షరాజ్య నౌకలను పట్టుకొనుట.

అమెరికా సంయుక్త రాష్ట్రముల అధ్యక్షుడగు రూజ్వెల్టుగారీవారం—అత్యద్భుతమైన ఒక దెబ్బతో—అమెరికా ప్రాంతాలలో జర్మనీ-ఇటలీల తంత్రాలను చాల భాగం భగ్నం చేశాడు.

యునైటెడు స్టేట్సు రేవులలోనున్న జర్మను, ఇటలీ, డెన్మార్కు దేశముల నౌకల నన్నిటినీ స్వాధీనం చేసుకోవలసినదని ఆ యుత్తరువు.

దాని ప్రకారం యునైటెడు స్టేట్సు పోలీసు అధికారులు తమ రేవులలోవున్న 69 నౌకలను స్వాధీనం చేసుకున్నారు. వీని పరిమాణం 300 వేలు టన్నులుంటుంది. వీనిలో 36 నౌకలు డెన్మార్కు దేశీయులవి. 27 నౌకలు ఇటాలియనులవి. 2 జర్మనులవి.



స్టేట్సు రేవులలోవున్న ఫ్రాన్సు నౌకలనుగూడా లెక్క వేశారు. కాని వానిని స్వాధీనం చేసుకోలేదు.

ఇట్లా జరుగుతుందని యెవరికీ తెలియదు. శనివారం రాత్రి సాయుధులగు యునైటెడు స్టేట్సు పోలీసు అధికారులు, ఆకస్మికంగా, రేవులలోవున్న ఆ నౌకలపైకి ఎక్కి, వానిలోవున్న సిబ్బందిని నిఖాలోవుంచి, ఆ నౌకలను స్వాధీనం చేసుకున్నారు. నౌకల అధికారులెవరూ, ఏవిధమగు ప్రతిఘటనా కన్పరుపలేదు.

జర్మను, ఇటాలియను నావికులు తమ నౌకలను శిథిలంచేసిపోవడానికి ప్రయత్నించిరనీ, అందుచే రేవులకు నష్టం కలుగకుండా చేసుకొనడానికీ నౌకలను స్వాధీనం చేసుకొంటిమనీ, అమెరికను అధికారులు చెలుపుచున్నారు.

అమెరికా సంయుక్త రాష్ట్రములకు—అక్షరాజ్యములకు యుద్ధం పొసగునని అపుడు తమ నౌకలను లాగుకొనెదరనీ భయంతో ఆక్సిసు నౌకల అధికారులు తమ నౌకలను శిథిలం చేసుకొనడానికి ప్రయత్నించుచున్నట్లు తెలుస్తుంది. ఈ విషయం కనిపెట్టి యునైటెడు స్టేట్సు అధికారులు ముందుగనే ఆ నౌకలను స్వాధీనం చేసుకున్నారు. శిథిలం చేయుడానికి ప్రయత్నం జరిగిన కొన్ని నౌకలలో నావికులను సిబ్బందిని నిర్బంధమునందుంచుటకుకూడా వుత్తరువుచేశారు.

తమ నౌకలను ఈవిధంగా లాగుకొనినందుకు నావికులను అరెస్టుచేసినందుకూ అసమ్మతి చెలుపుచు, వానిని విడుదల చేయవలసినదని, జర్మను ఇటలీ అధికారులు యునైటెడు స్టేట్సు అధికారులను కోరారు.

కాని యునైటెడు స్టేట్సు అధికారులా యాక్షేపణలను నిరాకరించి, ఆ నౌకలను విడచిపెట్టమని ప్రత్యుత్తరమిచ్చారు.

యునైటెడు స్టేట్సు అధికారులటుల తమ నౌకలను స్వాధీనమొనర్చుకొనిరని తెలియగనే, దక్షిణ అమెరికా రేవులలో వున్న అక్షరాజ్యాలనౌకలను, వాని అధికారులు తగుల పెట్టుకొనుటకు ప్రారంభించారు. దక్షిణం అమెరికా రాష్ట్రాల అధికారులు అట్టి చర్యను నిరోధించుటకొరకు వెంటనే ఆనౌకలను స్వాధీనపరుచుకుంటున్నారు. మెక్సికో అధికారులు రెండు జర్మను నౌకలను మరికొన్ని ఇటాలియను నౌకలను పట్టుకున్నారు. టంపికోవద్ద 2000 టన్నుల ఇటాలీనియను నౌకలను ఆ నావికులే తగులబెట్టుకున్నారు. యుకేడరునందు సెరిగో అను మరియొక జర్మను నౌకను స్వాధీనపరచుకొనుటకు అధికారులు రాగా, జర్మనులు దానిని తగులబెట్టుకున్నారు. వెనూవయాలో అధికారులు పట్టుకొనరాగా మాన్సెరెట్టా, లీప్‌జిగ్ అను జర్మను సరకుల నౌకలను వాటినావికులే తగులబెట్టారు. కూబా అధికారులు రెక్కా అను ఇటాలియను నౌకను స్వాధీనం చేసుకున్నారు. వెన్‌జులాస్‌నందు మూడు ఇటాలియను నూనె నౌకలు, మరియొక్క జర్మను నౌక, వాటి నావికులచే తగులబెట్టుకొనబడినవి. పుంటారినాస్‌వద్ద ఒకజర్మను నౌకను, ఒక ఇటాలియను నౌకను వాటి నావికులు తగులబెట్టివేసుకున్నారు. పెరూవియా రేవులనుండి రెండు జర్మను నౌకలు మొన్న సాయంత్రం పారిపోయాయి. పెరూవియను యుద్ధ నౌకలు వెంటనంటి జూడగా, ఆ రెండు నౌకలు నడిసముద్రంలో మండుచున్నాయి.

## సింగపూరులో బ్రిటిషు సైన్యాలు.

బ్రిటిషు ప్రభుత్వంవారు ఐరోపాలోని యుద్ధ రంగాలలో శత్రులను నిరోధించే సన్నాహాలలో నిమగ్నమైయున్నా, దూర ప్రాచ్య రంగాన్ని మరువలేదు. ఒకవేళ యుద్ధం చైనాకు దక్షిణంగావున్న బ్రిటిషు పాలిత దేశాలకు ప్రాకినా వానిని రక్షించుకోడానికి కావలసినంత సైనిక బలాన్ని అచట సమకూర్చి వుంచుతున్నారు.

బ్రిటనునుండి క్రొత్తగా మరికొంత విమానదళం, నౌకలు, సైన్యాలు, ఈ వారం సింగపూరులో దిగినాయి. భారత దేశాన్నించి, ఆస్ట్రేలియానుంచి వచ్చిన సైన్యాలు, ఇదివరకే సింగపూరు, మలయా ప్రాంతాలను కాపాడుతున్నాయి. ఈ క్రొత్త సైన్యాలు, వానికి మద్దతుగా వుంటాయి. క్రొత్తగా వచ్చిన సైన్యాలలో చాల భాగం, ప్రస్తుత యుద్ధంలో ఐరోపా రంగాలలో పోరాడి మంచి అనుభవం సంపాదించినవి. విమానదళంకూడ, జర్మనీపైన జరుపబడుచున్న దాడులలోను, బ్రిటనుపై జర్మనులు దాడు లొనర్చినపుడు జరిగిన యుద్ధాలలోను పాల్గొని మంచి అనుభవం నైపుణ్యం సంపాదించినవి.

క్రొత్తగా వచ్చిన భారతీయ సైన్యాలలో పంజాబీ దళాలు, రాజపుత్ర, మహమ్మదీయ పటాలాలు, డోగ్రా పటాలాలు, దక్షిణదేశపు పటాలాలుగూడ చాలా వున్నాయి. సింగపూరులో భారతీయులు ఈ సైన్యాలకు బ్రహ్మాండమగు స్వాగత మొసగారు.

### చైనా యుద్ధం.

చైనా దక్షిణతీరంలో కిచియోసింధు శాఖవద్ద క్వాంటుంగునందు గత శుక్రవారంనాడు జపానీయులు సైన్యాలను దింపారు. చైనీయులు ప్రతిఘటించలేదు. జపాను సైన్యాలు దిగిన ప్రదేశం చైనాలో బ్రిటిషువారికిగల హాంకాంగు రేవుకు 100 మైళ్లు దూరం వుంటుంది.

---

# మటపన్ వద్ద బ్రహ్మాండమగు నౌకా యుద్ధం

## ఇటాలియను నౌకాదళాన్ని బ్రిటిషు నౌకలు పూర్తిగా ధ్వంసం చేశాయి

మధ్యధరాసముద్రంలో ఈ వారం జరిగిన బ్రహ్మాండమగు నౌకా యుద్ధఫలితంగా ఇటాలియను నౌకాదళం ఇంచుమించు పూర్తిగా శిథిలమైపోయింది. బ్రిటిషు నౌకాదళానికి ఆ ప్రాంతంలో నిరాఘాటమగు ఆధిపత్యం లభించింది.

ఆ మహాయుద్ధం ఈ క్రింది విధంగా సంభవించింది. ఇటాలియను నౌకాదళాన్ని యుద్ధంలోకి లాగుటకు బ్రిటిషు నౌక లెంత ప్రయత్నించిన, ఇంతవరకును అవి అందుట లేదు. 27 వ తేది సాయంత్రం, వేగుచూచుటకు వెళ్లిన బ్రిటిషు విమానాలు, సిసిలీ ద్వీపమునుండి కొన్ని ఇటాలియను యుద్ధ నౌకలు తూర్పుగా వస్తున్నటుల చూచివచ్చి, అధికారులకు తెలియజేసినవి. బ్రిటిషు నౌకలు కొన్ని వెంటనే బయలుదేరి శత్రు నౌకలను ఎదుర్చుటకు వెళ్లినవి. 28 వ తేదీ ఉదయం, క్రెటీద్వీపానికి ఆగ్నేయంగా ఒక పెద్ద ఇటాలియను యుద్ధ నౌక, దానివెంబడి మరికొన్ని చిన్న నౌకలు కనుపించాయి. బ్రిటిషు నౌకలను చూచి శత్రు నౌకలు పడమటుగా తిరిగి వేగంగా వెనుకకు పారిపోవడం ప్రారంభించాయి. బ్రిటిషు విమానాలా నౌకలను పగలంతా పదేపదే ఎదిర్చి వానిపైన బాంబుల వర్షించాయి. బాంబు దెబ్బలవలన శత్రు నౌకలు చెడి వాని వేగం తగ్గిపోయింది. అందుచే, సాయంత్రమగు వేళకు, ఉదయమునుండి వానిని వెంట తరుముచున్న బ్రిటిషు యుద్ధ నౌకలు, వానిని సమీపించగలిగినాయి. పిమ్మట ఉభయపక్షముల నౌకలకు గ్రీసు దక్షిణ తీరమునగల మటపన్ అనే రేవుకు కొంతదూరంలో భయంకరమగు పోరాటం జరిగింది. ఆపోరాటంలో పోలా, జారా, ఫ్యూం అను ఇటాలియను క్రూయిజరులు మూడున్ను విన్సెంజోగి యొబర్టీ, మేస్ట్రేలిఅను రెండు డిస్ట్రాయరులును ముంచి వేయబడ్డాయి. మిగిలిన నౌకలకుగూడ చాలదెబ్బలు తగిలాయి. కాని చీకటిలో అవి తప్పించుకొని పారిపోయినాయి. వీనిలో మరియొక క్రూయిజరు ఒక డిస్ట్రాయరుకూడా మునిగిపోయినవి. తెల్లవారుసరికి సముద్రమంతా హతులైన ఇటాలియను నావికులతోను, యీదులాడుచున్న వారితోను నిండివుంది. మూడు క్రూయిజరులు, రెండు డిస్ట్రాయరులు ఈ పోరాటంలో మునిగిపోయినట్లు ఇటాలియనులుగూడా తమప్రకటనలో అంగీకరించారు. బ్రిటిషు నౌకలలో ఒక్కదానికిగూడా దెబ్బతగులలేదు. ఒక్క నావికుడైనా మరణించలేదు. రెండు బ్రిటిషు విమానాలుమాత్రం తిరిగి రాలేదు. ఈ మహా విజయంతో బ్రిటిషు నౌకలు సురక్షితంగా తిరిగి స్వస్థానమగు అలెగ్జాండ్రియా రేవును చేరుకున్నాయి. తిరిగి వచ్చుటకు పూర్వం, సముద్రంలో అల్లాడుచున్న ఇటాలియను నావికులలో 1,000 మందిని బ్రిటిషు నావికులు కాపాడారు. వారిలో కొందరు జర్మనులుకూడ గలరు. కాని పైన జర్మను విమానాలు వచ్చి ఎదిర్చడం ప్రారంభించుటచే, ఆ పనివదలి, బ్రిటిషు యుద్ధ నౌకలు తిరిగి పోవలసివచ్చింది. రక్షింపబడిన నావికులను గ్రీసులో దింపారు. ప్రస్తుతము ఇక మిగిలియున్న ఇటాలియను నౌకాబలమును గురించి ప్రశ్నింపగా అడ్మిరలు కన్నింగుహాముగారీ క్రింది లెఖ్ఖలను తెలియజేశారు: ఇటాలియనులకుగల పెద్ద తరగతి యుద్ధ నౌకలలో రెండువంతులు ముంచివేయబడెను. ఇక ఒక వంతుమాత్రమే మిగిలియున్నాయి. ఎనిమిది అంగుళాలు కైవారంగల ఫిరంగులు ధరించే క్రూయిజర్లలోను డిస్ట్రాయర్లలోను సగభాగంకు పైగానే ముంచివేశాము. ఆరు అంగుళాల ఫిరంగులుగల క్రూయిజర్లలోను, డిస్ట్రాయర్లలోను నాల్గవవంతు ఇప్పటికి మునిగిపోయాయి. జలాంతర్గాములలో నూటికి 30 వంతులు ముంచివేయ బడ్డాయి.

ఇటాలియనుల దురదృష్టం, ఇంతటితో ముగియలేదు. "పార్థియన్" అనే బ్రిటిషు జలాంతర్గామియొక్క సాహసచర్యవలన మరి రెండు పెద్ద నౌకలనుగూడ ఇటాలియనులు నష్టపోయారు. 28 వ తేదీన, చాల ఇటాలియను నౌకలు, యుద్ధసామగ్రిని భర్తీగా నింపుకొని ఇటలీనుండి అపుడే బయలుదేరినవి. వానివెంట రక్షణగా ఇటాలియను యుద్ధ నౌకలుగూడా వస్తున్నాయి. అవి ఇటలీ తీరానికి 600 గజాలదూరాన వుండగానే, "పార్థియన్" వానిని చూచి, వెంటనే, ఒకదానివెంబడి ఒకటిగా చాల "టార్పెడో" లను ప్రయోగించింది. శత్రు నౌకలు ఆ విషయం కనిపెట్టకముందే, దూరంగా తప్పించుకుపోయింది. ఆటార్పెడోలు తగిలి యుద్ధ సామగ్రుల నౌకలు రెండు వెంటనే మునిగిపోయినయి. అందులో ఒకటి 10 వేల టన్నులది. రెండవది 6 వేల టన్నులది.

ఆరోజుననే, అల్బేనియా రంగానికి యుద్ధ సరకులను కొనిపోవుచున్న మరియొక ఇటాలియను నౌకను, అల్బేనియా తీర సమీపాన 'ట్రిటన్' అను గ్రీకు జలాంతర్గామి చూచి "పార్థియన్" వలెనే యెదిర్చి టార్పెడోలను ప్రయోగించింది. ఆటార్పెడో దెబ్బలచే ఆ నౌక వెంటనే మునిగిపోయింది. అది 5,450 టన్నుల నౌక. మరియొక ఇటాలియను నౌకకు పెద్ద దెబ్బలు తగిలాయి.




ఇరిత్రియాలో బ్రిటీషువారు చేయుచున్న యుద్ధమును చూపు పటము.

# భారతీయ సైనికుల అద్భుత చర్యలు.

## ఇరిత్రియా ఆక్రమణ చరిత్ర.

### పంజాబి సైనికుడు గాయపడియు యుద్ధం మానలేదు.

ఆబిసీనియా వుత్తరాన ఇటలీ వశమందున్న ఇరిత్రియాలో యెక్కువభాగం బ్రిటిషువారి వశమయింది. ఏడు వారాల యుద్ధ ఫలితంగా కెరెన ముట్టడితో యీ రంగమున యుద్ధం ముగిసినట్లే యెంచవచ్చును.

కెరేనుకు చేరువలోవున్న యెర్రసముద్రం రేవు పట్నమగు మస్సావా ఆక్రమించుటకు శత్రువుల నిరోధం అట్టేయుండదు. ఇరిత్రియా ముఖ్య పట్నమగు అస్మారాయు బ్రిటీషువారి వశమయ్యెను.

ఈ ప్రాంతాల యుద్ధం భారత దేశానికి యెక్కువ పేరు ప్రతిష్టలను చేకూర్చింది. ఇచట కొండల మధ్యన రోడ్లులేని పుట్టలు, గుట్టలు, పొదలు, ముండ్లడొంకల మధ్య అతివడిగా పోయి శత్రువులను ఛేదించి, తరిమివేసి సుమారు వేయి మైళ్ల మేరను బ్రిటిషువారికి చేకూర్చి, భారతీయ సైనికులు ఖ్యాతి సంపాదించారు. చరిత్ర ప్రసిద్ధమగు వీరి ఘనకార్యాల వివరములు యిపుడు తెలియవచ్చాయి.

కెరేను వశమైన రోజున అచ్చోటనుండి స్వయంగా చూచిన, భూపాలు నవాబుగారు యీజిప్టు ముఖ్య పట్నమైన కెయిరో నగరం చేరింతరువాత మనదేశం సైనికులగూర్చి గర్వంతో యిట్లు చెప్పేరు :

“మన సైనికులు చాలా కష్టాలమధ్య ఘనకార్యాలచేసి తమ నాయకుల మెప్పును, తోడి సైనికుల మెప్పునుపొందేరు. వారినిగాంచి ఇండియా గర్వపడుచున్నది. తమ సైన్యం కన్న అత్యధిక సంఖ్య సైన్యంగల్గి స్థావరమేర్పచుకొని పట్టుదలతోవున్న శత్రువును ఛేదించి తరిమివేయుటయందు భారతీయ సైనికులును, బ్రిటిషు సైనికులును చూపిన ధైర్యాన్ని నేనెంతయు కొనియాడుచున్నాను.”

మన నవాబుగారేగాక, ఇంగ్లీషు దొరలగు సేనాధిపతులు విలేఖరులుగూడ మన సైనికుల చర్యలను కొనియాడిరి. బ్రిటిషు చక్రవర్తిగారుగూడ అభినందిస్తు సందేశం పంపేరు.

ఆఫ్రికా యుద్ధంలో యిట్టి అద్భుత చర్యలు చేయడానికి మన సైన్యానికి యిది మూడోసారి. అదివరకు సిడిబరాని గెలిచినప్పుడు, గెలుపంతలో మూడోంతులు భారతీయ సైనికుల ప్రతిభవల్లనే వచ్చిందని అందరు అంగీకరించేరు. తరువాత జనవరిలో ఇరిత్రియా దాడి ప్రారంభించినపుడు, సుడాను-ఇరిత్రియా సరిహద్దులందున్న ఖసాలా నగరంనుండి బయలుదేరి 15 దినాలలో 140 మైళ్లు కొండ ప్రదేశాన్ని దాటి తోవలో కాచియున్న ఇటలీ సైన్యాలను తరుముకుంటూ తొలినాడు, మరునాడు అగోరడట్-బెరాంటు పట్నాలను పట్టుకున్నపుడు, రెండోసారి ప్రశంసింపబడిరి.

ఈ దాడి బహు చిత్రంగా, అతినేర్పుగా, యెక్కువ సమర్థతతో విజయవంతంగా ముగిసింది. పంజాబీలు సరిహద్దు రాష్ట్రంవారు, రాజపుత్ర సైనికులు, స్కాటిషు కొండ సైన్యాలుగల బ్రిటిషు దళం ఒకేపూఘున రెండు వరుసలుగా రెండు దారులగుండా వచ్చి శత్రువులను కనబడ్డ చోట్లల్లా, తిరుగబడినపుడల్లా యెదిరించి వోడించి వెంటాడి తరిమివేసింది. ఖసాలానుండి తూర్పునకు అగోరడట్ వైపు ఒకదళం బయలు దేరింది.

దక్షిణంగా కెస్సని బరాంటుల వైపు ఇంకోజట్టు బయలు దేరింది. రెండింటిలో భారతీయ సైనికులు దండిగా యున్నారు. అగోరడట్-బెరాంటు రోడ్డునకు అడ్డంగా ఒక దళంపోయి ఆ మార్గం చెడగొట్టి ప్రక్కగావచ్చిన వేరొక దళంలో కలియుసరికి, బెరెంటు నగరాన్ని శత్రువులు విడచిపోయినారు. పది రోజులు మన సైనికులు ఘోరంగా యుద్ధంచేసి శత్రువును యీ స్థితికి తెచ్చిరి. అనేక శవాలను పెక్కుమంది ఖైదీలను యుద్ధ సామగ్రిని విడచి శత్రువులు పోయేరు.

## పంజాబీల ప్రతిభ.

ఇరిత్రియా యుద్ధ రంగమునందు మార్గం సరిగాలేదు. అంతా కొండలమయం అయినా సరిహద్దు రాష్ట్రంలో యిలాంటి ప్రదేశంలోనే తరిఫీదయిన భారతీయ సైనికుల కది కష్టమనిపించలేదు. ఇదివరకు ఒంటెలకు తప్ప యింకెవరికి సంచరింప వీలులేని ప్రదేశమది. అగోరడట్ కి ముందు కెరు అను గ్రామం పట్టుకొన్నారు. ఇక్కడనుండి రెండు వైపుల 1,000 లేక 1,500 అడుగుల ఎత్తుగల కొండల నడుమ ఒక గోర్జితోవ అగోరడటుకి గలదు. ఈ ప్రక్క కొండలపై శత్రువులు ఫిరంగులు మాటించుకొని గోర్జిలో అనేక గోతులు అడ్డంకులు నిర్మించియుంచిరి. కాని సిక్కు సైనికులు అతి నేర్పుగా వాటిని దాటి శత్రువులను ఎదిరించి అనేకగుంపులను చెదించి తరిమివేసిరి. ఇండియను సేపర్సు, మైనర్సు (అంటే సైనికులకు సహాయం చేసే దళం) ఆరు గంటలలో దారి సదును చేసిరి. తరువాత బిసియాయను రైలు స్టేషను, కెస్సెను పట్టుబడినవి. ఇరిత్రియాను ఉత్తర అబిసీనియాతో కలుపు ఒకేరోడ్డు నైరుతిదిక్కుగా బెరెంటు నగరం పోతుంది. రసపుత్ర కాల్బలము మోటారులతో గూడ అతివడిగా పుట్టలు గుట్టలు దాటి యీ రోడ్డును చేరి ముందునకు పోయింది. వేరొక వైపునుండి గారివాలు బెలూచిస్తాను సైనికులువచ్చిరి. ఈ రెండు దళముల మధ్య శత్రువుల లారీలు యుద్ధసామగ్రి టపాలు చిక్కుపడి దొరికినవి.

అటునుండి యీ సైన్యం బరెంటు వైపుపోయి త్రోవలో మగాలోవద్ద ఎదిరించిన ఇటలీ సైన్యాన్ని ఓడించింది. మొదట కసాలానుండి తూర్పునకు పోయిన పంజాబీ సైన్యం అయికాటు అనుపట్నం ఆక్రమించిన తరువాత అదికూడ బెరాంటుమీదకు వచ్చినది. త్రోవలో గోగ్ని గ్రామంవద్ద తుపాకులు సున్నీలు ఉపయోగించి శత్రువును ఓడించిరి. అగోరడటువైపు పోయిన సైన్యం కొరెవద్ద రెండుమైళ్ల పొడవునగల కొండ దాటి ఒకరోజు తీవ్రయుద్ధంలో శత్రువు నోడించెను. కొండనెక్కి చేతిబాంబులను విసరి అతికష్టంపై శత్రువులను అగోరడటువరకు తరిమివేసెను. ఆ నగరాన్ని ఒక రోజు ఒక పగలు ముట్టడిచేసి వశపరచుకొనెను.

ఆదే సమయాన బెరాంటు నగరం ముట్టడి జరుగుచుండెను. 2,500 అడుగుల ఎత్తుగల కొండల చాటునుండి శత్రువులు నాల్గు రోజులు హెూరాహెూరి యుద్ధం చేసిరి. ఒక కొండ తరువాత ఒక కొండను ఆక్రమిస్తు మన సిపాయిలు చివర కానగరం వశపరచుకొనిరి.

త్రోవలో 200 గజముల మేర శత్రువులు మందుగుండు గనులు నాటగా ఇండియను ఇంజనీరులు వాటిని అతివడిగా తీసివేసి రోడ్లను తమ సైనికులకు సదును చేసి యిచ్చిరి.

## కెరెను దాడి.

అగోరడటు, బెరాంటు పట్టుబడినతరువాత అదే ప్రకారంగా భారతీయసైన్యాలు ఒక జట్టు రైలురోడ్డు ననుసరించియు వేరొకటి కొండమార్గము ననుసరించియు తూర్పుననున్న కెరేను నగరం వైపు పోయినవి. కెరేనులోయలో దాడి అతివడిగా జరిగెను. కొండమార్గమున పోయినదళం కెరేను చేరువ ఒక కొండ ఆక్రమించెను. ఆ సమయాన ఇటలీ సైనికులు దాలగోరడకు అను బ్రిటిషు కోటపై దాడి ప్రారంభిస్తున్నారు. అకస్మాతుగా భారతీయ సైనికులు వారిపైబడి ఓడించి అనేకమంది ఖైదీలను పట్టుకొన్నారు. అట్లే రైలు మార్గమున వచ్చిన దళం సాంచిలి కొండనుండి శత్రువులు దిగి రాకుండా మార్గం నిరోధించి అక్కడ కాపలాయున్న ఇటలీ దళాన్ని ఓడించింది. బ్రిటిషు సైన్యాలాక్రమించిన నాల్గు తావులను వశపరచు కొనడానికి ఇటలీవారు ఎదురు దాడి సాగించేరు. కాని నాల్గుచోట్ల ఓడిపోయేరు. చివరకు కెరేను నగరం పడిపోడానికి రెండు రోజులుండనగా 12 సార్లు ఎదురు దాడి జరుప యత్నించి విఫలులైరి. భారతీయ సైనికులు పట్టిన తావు కొంచెమైనా విడవలేదు. అతి ధైర్యంగా ధీమాగా ఎదిరించేరు. కొండలమీదనుండి శత్రువులను త్రోసివేసిరి. రెండు వైపులనుండి దాడి సలిపి, ఆ నగరాన్ని వశపరచుకొన్నారు.

## సైనికుల ప్రత్యేక ప్రతిభ.

ఈ యుద్ధంలో ప్రత్యేకవ్యక్తుల వీరత్వం బాగా కనబడింది. ఒక భారతీయ కమీషన్డు ఆఫీసరు తన సైన్యాన్ని శత్రుఫిరంగి గుండ్ల మధ్య నేల ప్రాకించి ఎత్తైయిన కొండను ఆక్రమించేడు. అచటనున్న శత్రుసేన తిరిగికొట్టుసరికి తాను గాయపడినప్పటికి తన సైన్యాన్ని సురక్షితంగా వెనుకకు మరలించి తెచ్చెను. గాయపడిన సిపాయిని తీసుకొని పోవుచున్న ఒకనిని శత్రువులు చుట్టవేయగా వాడా సిపాయి తుపాకి తీసుకొని శత్రువులను తరుమగొట్టి సిపాయిని తీసుకపోయెను.

ఒక మరఫిరంగి ప్రేల్చువాడు మితిమీరిన శత్రువులపై ఫిరంగి ప్రేల్చుచు చాలా నష్టపరచెను. బాంబుపడినను విడువక చేయి ఫిరంగి మీటపైనే ఉంచి చనిపోయెను.

## కాలిలో గుండ్లతో యుద్ధంచేయుట.

ఒక పంజాబి సిపాయి యువకుడు కొద్దిమంది సైనికులతో, గుండ్లు ప్రేలుచుండగా ఎదురుగాపోయి శత్రువుల మర ఫిరంగిని చెడకొట్టెను. ఆ చెడిన మర ఫిరంగి ప్రక్కనే తన తుపాకిని ఉంచి తిరిగి వచ్చుచున్న శత్రువులను బెదరగొట్టి పంపివేసేడు. తరువాత కుంటుకుంటు పోయి తన సైనికులను హెచ్చరించేడు. రెండు కాళ్లల్లో గాయాలున్నను యితరులు తనను మోయకూడదని, చికిత్సకై నడిచే వెళ్లేడు.

## సేపరులు, మైనర్లు.

సైన్యాలకు రోడ్లు సరిచేసి సామానులందిచ్చు చాకిరీ దళమగు వీరు యుద్ధంలో చాలా తోడ్పడ్డారు. కొన్నిచోట్ల వాళ్లు అంచెలుగా నిలబడి ఎన్నోమైళ్ల దూరంనుండి తెచ్చి కొండలమీద యుద్ధంచేస్తున్న సైనికులకు నీళ్లు అందించేవారు. పదిరోజులలో 675 మందుగనులను తొలగించి ఒక వంతెన బాగుచేసేరు.

# మధ్యధరా సముద్ర యుద్ధం.

## బ్రిటిషువారు గెలువక తప్పదు.

### ఇటలీ-ఇంగ్లాండు బలాబలములు.

యూరోపు ఆఫ్రికాఖండముల మధ్యనున్న మధ్యధరా సముద్రంలో అనేక దేశాల భాగ్యభోగములు నిర్ణయింపబడినవి. అతి చిన్నదయినా అతిపురాతన నాగరిక చరిత్రలందు ప్రాముఖ్యత వహించిన సముద్రమది. దీనికి తూర్పు-పడమరల ద్వారములు బ్రిటిషువారి వశమందున్నవి. తూర్పున సూయజు కాల్వ, పడమరను జిబ్రాల్టరు జలసంధులు గలవు. జిబ్రాల్టరు రేవు యీ సముద్రంయొక్క పడమర భాగంఅంతకు ఆధిపత్యం వహిస్తుంది. యూరోపునుండి ప్రపంచంలో ఏభాగానికి పోవలసియున్న, యీ రేవుని తగిలే తీరాలి. స్టీమరు మార్గాలన్నింటికి కూడలి స్థలం. సూయజు కాల్వయూ, ఈజిప్టులోఉన్న అలగ్జాండ్రియా రేవుకూడ బ్రిటిషువారి వశమందున్నాయి. అలగ్జాండ్రియాలో సైనిక నౌకాదళ శిబిరాలున్నాయి. మధ్యధరా సముద్రం ఈశాన్యదిక్కున నల్లసముద్రం (బ్లాకు సీ) కలదు. రషియాకు యీ సముద్రతీరాన రేవుస్థలములు కలవు. నల్లసముద్రాన్ని మధ్యధరా సముద్రంతో కలుపునట్టి సన్నని బాస్ఫరసు జలసంధి, మర్మరా సముద్రం, టర్కీదేశం వశమందున్నాయి. ఈ టర్కీతోను, గ్రీసుతోనుగూడ ఇంగ్లాండుకి సఖ్యతగలదు. ఇంకా తీరాన్న ఉన్న పాలస్తీనాపై ఇంగ్లాండునకు మాండేటరీ పరిపాలనాధికారం కలదు. ఈ పాలస్తీనాలోఉన్న హైఫా రేవునకు, ఇరాకు రాజ్యంలో ఉన్న చమురుగనులనుండి పైపు గొట్టాలుగలవు. ఆ ప్రక్కనేఉన్న ట్రాంసుజోర్డోనియా, ఇరాకు దేశాలపైగూడ ఇంగ్లాండుకి పలుకుబడి కలదు.

మధ్యధరా సముద్రంలో ఇటలీకిగూడ కొంత అధికారం గలదు. మధ్యభాగాన్న ఉన్న సిసిలీ, పెంటలేరియా దీవులు ఇటలీవే. సముద్రంలోకి చాచిన నాలుకవలె ఉన్న ఇటలీకిని, దక్షిణాన ఆఫ్రికాదేశానికి మధ్యగా యీ దీవులున్నాయి. తూర్పు భాగంలో డడకనీసు దీవులు ఇటలీవే. అందుచే సముద్రం తూర్పు భాగంలో బ్రిటిషువారితో చేయిచేసుకొని, పూర్తిగ అధికారం సంపాదించాలని ఇటలీ చాల కాలంనుండి అభిలషిస్తున్నాది. మధ్యధరా సముద్రం "మా సముద్రం" అంటారు ఇటలీవారు. "ఇది బ్రిటిషువారికి అనేక మార్గాలలో ఒక మార్గం అయితే, ఇటలీకి ప్రాణాధారమగు ఏకైక మార్గం" అని ముసోలిని ఒకసారి అన్నాడు. అందుచే యీ సముద్రంలోనే యిపుడు బ్రిటిషువారి యుద్ధనౌకలు కనబడగానే ఇటలీ నౌకలు తోక ముడుచుకొని పారిపోవడం చిత్రంగాఉంది. గతవారంలో మధ్యధరా సముద్రంలో తూర్పు భాగమునందు నుటపం రేవు దరిని జరిగిన నౌకా యుద్ధంలో ఇటలీవారివి ఏడు యుద్ధ నౌకలు యుంచబడినవి. (దీని వివరాలు వేరొకచోట ప్రకటింపబడ్డాయి.)

### జర్మను విమానాలు వందలు పడిపోయాయి.

ఇటలీ తన నౌకాదళంలోనేగాక, విమానదళం సహాయంతోగూడ బ్రిటిషు నౌకాదళాన్ని అరికొట్టాలని చూసింది. ఆ యెత్తు ఫలించలేదు. బ్రిటిషు విమానదళం ఆల్బేనియా, ఉత్తరాఫ్రికాలయందు విజయ పరంపరనుపొంది, ఇటలీ విమానాలను ఎక్కడ అగుపడకుండా తరిమివేశింది. అందుచే జర్మను విమానదళం సహాయాన్ని ఇటలీ కోరవలసివచ్చింది. జర్మనుల బాంబరు విమానాలు కొన్ని ఇటలీవారివగు సిసిలీలో కాటానియావద్ద స్థావరముండి, బ్రిటిషువారి మాల్టాదీవియందున్న నౌకా కేంద్రాలపై అనేకసారులు దాడిసలిపినవి. కాని లాభంలేకపోయింది. బ్రిటిషువారి యుద్ధ నౌకలనుగాని, వర్తకసప్లై నౌకలనుగాని సముద్రాలలో తిరుగకుండ చేయలేకపోయినాయి. గ్రీసునకు పోవుచున్న ఒక సరకుల నావకు కాపలాయున్న బ్రిటిషు యుద్ధ నౌకలను ముంచుటకు జర్మను వైమానికులు బాంబులువేసి ప్రయత్నం చేసేరు కాని ఆనావ గ్రీసు చేరగలిగెను. సౌదాంప్టను అను బ్రిటిషు నౌక పూర్తిగా చెడినందున బ్రిటిషు వారే దాన్ని ముంచివేసినమాట నిజమే. విమానాలకు రవానాచేయు యుద్ధ నౌక ఇల్లస్ట్రియసనునది దెబ్బతిన్నది కాని యితర సహాయంలేకుండా రేవు స్వయంగా చేరగల్గింది. ఇంకో యుద్ధ నౌక దెబ్బతిన్నది. బ్రిటిషువారి నౌకలకు యీ మాత్రమే నష్టం కలిగింది కాని, ఇందుకు ప్రతిగా ఎన్నో వందలు జర్మను విమానాలు పడగొట్టబడ్డాయి. కాటానియాపై బ్రిటిషు విమానాలు దాడిజరిపి చాల నష్టంచేసినవి. మధ్యధరా సముద్రంలో బ్రిటిషు నౌకలు స్వేచ్ఛగ తిరుగుచునేఉన్నాయి. "నాజీవికాని, ఫాసిస్టువికాని విమానాలు ఆకాశంలో లేకుండా కొట్టండి" అని అడ్మిరలు కన్నింగుహాముగారు తమ నావికులకు ఉత్తరువు చేసిరి.

### బ్రిటిషు నౌకాదళ ఆధిక్యత.

ఇటలీ యుద్ధ నౌకలును, వర్తకనౌకలును స్వేచ్ఛగ మధ్యధరా సముద్రంలో తిరుగకుండా బ్రిటిషు నౌకలు ఆటంకపరచి అధికారం చెలాయిస్తున్నాయి. కాని టర్కీ చేరువగా ఉన్న డడకనసుదీవులకు, లిబియాలో ట్రిపోలికి అప్పుడప్పుడు ఇటలీ స్టీమరులు పోగల్గుచున్నవి. ట్రిపోలీకి కొందరు జర్మను సైనికులు యిటీవలనే చేరిరట. ఇటలీవారివగు సిసిలీ కాల్వగుండాను, ఒట్రాంటో జలసంధియందును బ్రిటిషు యుద్ధ నౌకలు పోగల్గుచున్నవి. జర్మను విమానాల బాంబులను తప్పించుకొని ఆల్బేనియా రేవగు వలోనాను బ్రిటిషు యుద్ధ నౌకలు ముట్టడిచేయగల్గినవి.

సముద్రంలో ఆధిక్యతయనగా, శత్రు నౌకలను బయటకు రాకుండా రేవులలోనే ఉంచగల్గి, వారివర్తకానికి వీలులేకుండ చేయగల్గియుండాలి. బ్రిటిషు యుద్ధ నౌకలును, వాటికి సంబంధించిన విమానాలును టోరెంటో రేవుపై దాడిసలిపి కావూరు అను ఇటలీ యుద్ధ నౌకను ముంచివేసి, మరి కొన్నింటిని చెడకొట్టి, తమ ప్రతిభను చాటినవి. టోరెంటో అతి భద్రమయిన రేవుగాను, మందు గనులతో రక్షింపబడుచున్నదిగను ఎంచబడినది. కాని బ్రిటిషు నౌకా విమానాలకు అదో లెక్క. ఇటలీవారి పెద్ద వర్తకరేవు స్థలమగు జినోవాగూడ ముట్టడి చేయబడింది.

ఇంతకన్న తక్కువ నౌకా దళంతోనే బ్రిటిషువారు మధ్యధరా సముద్రంలో ఇటలీవారిని దూరాన ఉంచగల్గిరి. కాని శత్రువును యీ సముద్రంలోంచి పూర్తిగ తుడిచివేయాలంటే ఒక్క నౌకాదళం ఘట్టిది ఉండడం చాలదు. కాపలాకాయు స్టీమరులనేకం, రాత్రింబవళ్లు శత్రువుల వర్తక నౌకలను వెదకుచుండు విమానాలు, చీకటిలో సన్నసన్నగా ఒకరేవునుండి యింకోరేవుకి శత్రు నౌకలు పోవుటకు వీలులేని విశాలమగు సముద్రం ఉండాలి, వాతావరణం

కూడ బాగుండాలి. మధ్యధరా సముద్రంలో వాతావరణం, ఎల్లప్పుడు కాకపోయినా, చాలవరకు బ్రిటిషువారి ఎత్తులకు అనుకూలంగానే ఉండెను. కాని సముద్రం విశాలమయినది, శత్రువుల తీరం చాల పెద్దది అగుటచే, పూర్తిగా శత్రునావలను తొలగించుటకు వీలు లేకుండెను.

## ఒట్రాంటో జలసంధి.

ఇటలీకి ఎదురుగానున్న ఆల్బేనియాకు మధ్యనున్న ఏడ్రియాటికు సముద్రమునకు ద్వారమువలె ఓట్రాంటో జలసంధిగలదు. ఇది 45 మైళ్ళ వెడల్పుగలది ఇందుపోవు బ్రిటిషు స్టీమరులకు యిరుపైపులనుండు శత్రురేవుల ఫిరంగి గుండ్లు తగులనేరవు. కాని రాత్రులందు యీ తీరమునుండి ఆ తీరానికి ఇటలీ స్టీమరులు భద్రంగా చేరిపోగలవు.

## సిసిలీ కాల్వ.

మధ్యధరా సముద్రమునందు యింకో ముఖ్యమగు తావు సిసిలీ కాల్వ. సిసిలీ దీవి నైరుతి కొననుండి, ఎదురుగనున్న ఫ్రెంచి ఆఫ్రికాలోని ట్యునిసు రేవువరకు 90 మైళ్ళ సముద్రంగలదు. లిబియాలో ఇటలీవారికి యింకా మిగిలియున్న రేవు ట్రిపోలీ. ఇక్కడనుండి పెస్సారో కేపునకు 290 మైళ్ళు కటానియా విమాన శిబిరమునకు 360 మైళ్ళు గలదు. బ్రిటిష్‌వారి కోటవంటి దీవి మాల్టా యీ చేరువనందే ఉన్నప్పటికి, ఇటలీ నౌకలు తమ తీరం చేరువగానే ప్రయాణం చేయుచు, రాత్రులందు యీ 90 మైళ్ళ కాలవా దాటి టునీసియా తీరాన లిబియాకు పోగలవు. సిసిలీ-టునీషియాల మధ్య బ్రిటిషువారి కాన్వాయి (కాపలాతోనున్న రాఘారి నౌకలు) పోగలవు.

## మధ్యధరాలో బ్రిటీషు విజయం తప్పదు.

మధ్యధరాసముద్రం రెండు ద్వారాలగు జిబ్రాల్టర్ సూయజులను వశమందుంచుకొని శత్రు నౌకలను బంధించివేసిన ఇంగ్లండు, యిపుడు ఆఫ్రికాలో విజయ పరంపరను బడసి, పెద్ద సముద్ర తీరాన్ని ఆక్రమించింది. ఇటలీవారి నాల్గు ముఖ్య శిబిరాలలో టోబ్రుకును బ్రిటిష్‌వారు వశపరచుకొనిరి. మిగిలిన టోరెంటో, ట్రిపోలీ, లీరోలు అనుదినం బ్రిటిషు విమానాల బాంబులకు గురియగుచున్నవి. డార్డెనెల్సుకు దగ్గర త్రోవ చూచుకొనుటకై గ్రీసు నాక్రమించడానికి ఇటలీవారి యత్నం చెడిపోయిందికదా. ఆల్బేనియాలో వారి రేవులకే యిపుడు ముప్పురానున్నది. ఈజిప్టును బెదరించి బ్రిటిషువారి అలెగ్జాండ్రియా పైబడజూచుసరికి, అది ఎదురుతిరిగి బార్డియా టోబ్రుకు, బెంగాజియను లిబియా రేవు స్థలాలను వదులుకోవలసి వచ్చింది. స్వదేశంలో తీరపు శిబిరాలకు బ్రిటిషు బాడులచే నష్టం కలుగుచున్నది; జిబ్రాల్టర్-సూయజు మార్గముల ద్వారా చమురు సప్లైరాదు; ఇక ఇటలీ-మధ్యధరా సముద్రంలో బ్రిటిషు నౌకలను కదలకుండా చేయడంగాని, బ్రిటిష్‌వారి సముద్రాధికారం తొలగించడంకాని ఏలాగ సాధ్యమవుతుంది? జిబ్రాల్టరుపై బడమని స్పెయిన్ను-జర్మనీ ఎంత ప్రోత్సాహించిన, తమ దేశం అంతా బ్రిటిషు నౌకల ఆగ్రహానికి గురియగుతుందని స్పెయినువారు భయపడి వినలేదు; బిజార్టా మున్నగు ఆఫ్రికా రేవులను విడువమంటే ఫ్రాంసు ఒప్పుకోలేదు. ఇంగ్లిషువారి సఖ్యత వదలమని డార్డనెల్సు జలసంధి కాపలా అధికారంగల టర్కీని జర్మనీ అడిగి కాదనిపించుకుంది. ఇక మధ్యధరాసముద్రం యుద్ధంలో యెవరు గెలుస్తారను విషయంలో ఏమీ సందేహం వుండనక్కరలేదు.

---

# పాపం! ఇటలీగతి.

ఇటలీ స్థితి యిప్పుడు చాల విచారకరంగా ఉంది. “ రాజకీయ వేత్తలు యుద్ధాలు ప్రారంభించి మనలను గోతులో దింతుతారు ” అని ఒక ఇటలీ సైనికుడు యెప్పుడో అన్నాడట. అది అక్షరాల నిజమైంది. ఫ్రాంసు ఓడిపోయిన తరువాత, ఏదో లాభంపొందుదామని తొందరపడి ముసోలిని యుద్ధంలో దిగేడు. మొదట్లో ఆల్బేనియాలోను ఆఫ్రికాలోను కొంతదేశం ఆక్రమించగలిగినా, యిపుడు అవన్ని వదులుకోవలసివచ్చింది. వేలకొలది సైనికులు చచ్చేరు. అంతకన్న ఎక్కువమంది ఖైదీలయ్యేరు. ఇపుడు జర్మనీయే దిక్కుగా, అన్ని విషయములందు జర్మనీకి దాశ్యం చేయవల్సి వస్తూంది కనుక, ప్రజలందరికి అసంతృప్తి ఎక్కువై, ఫాసిజం అంటే (అధికారంలోనున్న పక్షం) ఆసహ్యించుకుంటున్నారు. ఫాసిస్టు పార్టీ సంస్థకు జర్మను గూఢచారులగు గెస్టాపో ఏజంటుల సహాయం ఉంది కనుక, ప్రజలు తిరుగుబాటు లేయజాలకున్నారు. ఇపుడు ఓడిపోతున్నా, జర్మనీ యీ వసంత ఋతువులో జరిపేదాడి ఫలితంగా ఇటలీ చివరకు విజయం పొందగలదను ఆశలు పూర్తిగా పోయిన తరువాతైనా, ఇటలీలో తిరుగుబాటు రాకతప్పదు. ఇటలీ దుస్థితి అంతకూ ముసోలినియే కారణం. ఇటలీ సైనికులు తమ కిష్టంలేకున్నా, ఎందుకో కారణం తెలియకపోయినా, బలవంతంగా యుద్ధంచేస్తున్నారు.

ఇటలీ జనసంఖ్య 450 లక్షలు. గ్రీసు జనసంఖ్య 80 లక్షలు. ప్రపంచ చరిత్రలో శాశ్వతంగా నిలచియుండగల ఖ్యాతిని గ్రీసు సంపాదించింది. గ్రీసునుండి తీసుకున్న ఆల్బేనియాలో ఓడిపోవుచున్న తన సైనికులకు ప్రోత్సాహం కలిగించి గెలిపించడానికి స్వయంగా పోయినా ముసోలిని తిరిగివచ్చినపుడు ఓటమివార్త వెంట తేవలసివచ్చింది.

## ఇంగ్లీషువారి ఔదార్యం.

తూర్పు ఆఫ్రికాలో యుద్ధంలో పాల్గొనని ప్రజలెందరో ఉన్నారు. అబిసీనియాలో ప్రజలు ఇటలీవారిపై పగ సాధించడానికెంతో కారణం ఉంది. ముసోలినిగారి నల్లచొక్కాల సైన్యం అడిసుఅబాబానగరాన్ని ఆక్రమించినపుడు ఊరకినే 600 మంది ప్రజలను తుపాకులతో కాల్చి చంపేరు. ఇపుడు బ్రిటిషు ఉన్నతాధికారులు యిట్టి అత్యాచారాలు జరుగకుండా చూస్తున్నారు. పారిపోవుచున్న ఇటలీ సైనికులు విడిచిన ప్రదేశాలలో సివిలు ప్రజలు శత్రువులైనప్పటికి వారిని కాపాడుటకు బ్రిటిషు సైన్యాలు శ్రద్ధవహించి తమకు సహజమగు ఔదార్యం నాగరక సభ్యత ప్రకటించేయి. ఇటాలియను సోమరిలాండులో వీరి చర్యను మతగురువు పోపుగారు ప్రశంసించిరి. కాని బ్రిటిషువారి ఔదార్యానికిగూడ కొంతమితి ఉంటుంది. యుద్ధంలో పాల్గొనని సివిలు ప్రజలను కాపాడాలని యింతవరకు ఇటలీవారు కోరలేదు. అట్లా కోరితే ఓడిపోయినట్లంగీకరించడం అవుతుంది.

సలహా: ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు క్రమముగా భద్రపరుచుకొనుడు.

ఈసరు సెలవులవలన 1941 వ సం॥ ఏప్రిల్ 10 వ తేది గురువారమునాడు యుద్ధ సంచికయొక్క తరువాతి ప్రతి ప్రకటింపబడును.

[మదరాసు సమాచారముల డైరెక్టరుగారు వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

MADRAS: PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.